శ్రీరామ

## సూర్య ప్రార్థన.

ఉదయంబువేళ మిమ్ముగ నేవేడెదర। ఉలిక్క్రమ్ములమాన్పుమిా। జగత్కర్తవు లోకరక్షకుడవు। భాస్కరా శ్రీసూర్యనారాయణా। అని ప్రతిపదరిఅఖరున పాడేది॥ అంధకారమ్ములోనా ఆలోకమ్ములుమునుగుతూ। అరుణకిరణములకు ముందుగాయే తెస్తిరి॥ భా॥ సూ॥ ప్రొద్దుపొడిచేటప్పుడు ఆజనులు నిద్రిమేల్కొనిపొగడగా। భక్తులనుపాలింపుమిా॥ భా॥ పగడదీప్తులచాయలా వీర నరసింహరూపున పూర్వాద్రిపై వుదయమైతివి॥ భా॥ కెంపులుచెక్కిన పసిడివన్నెలచాయలా మిారథముఅన్నిదిశలనుబారగా। ఆకుపచ్చలహాయముపై। యెక్కగాఅందమిది॥ భా॥ బాలక్రీడాదులనకా। మహారుషులు మిమ్ముజేరికొలువగా। సప్తవర్ణములరథము సరసమ్మిది॥ భా॥ బాలభాస్కరుడమిాకు। పంచామృతస్నానంబు రొనరించెద। శుద్ధోదకస్నానముజేయుమిా సిద్ధంబుజేసితిని॥ భా॥ బింబరూపమ్ము దాల్చి కనకపీతాంబరిమ్ము క

ప్పకొని । రథముపైపీఠింపుతూ రంజిలుదువు॥ భా॥ అ
ర్ఘ్యపాద్యములిచ్చెదర । హేమములో యజ్ఞోపవీతం
బు ధరియింపుమీ । మకరకుండలకాంతితో । మణికిరీ
బెట్టితిపీ॥ భా॥ శంఖుచక్రములతోను । సరసముతో
చతుర్భాహువులు మెరయగా। తేజస్వరూపులనగా । దీప్తి
తోఖలులద్భంత్తువుమెప్పడు॥ భా॥ పాదముల అందెలే
మోగ్రియగాను । భమిడిమొలనూళ్ళు మెరయా । భూమి
పాలింపమీరు । భుజకీర్తులతోవస్త్రరీ॥ భా॥ దివ్యచంద
నగంధము । తీరైనపుష్పమాలికలతోను । కస్తూరితిల
కంబుతో । కమలావ్తకరుణించు॥ భా॥ పారుజాతపువిరు
లతో । బాగైన తులశీదళములపూజలు । బుద్ధిలోమి
ముదలచుకు । వొద్దికతో జేయుచుందును॥ భా॥ అగరు
సాంబ్రాణిదెచ్చి వరుసతో ధూపంబు లొనరించెదా । దీ
పహారతులిచ్చెద । దివ్యముగ గైకొనుమి॥ భా॥ కనకకల
శముల్లతోను । నిండుగాగంగజలములుదెచ్చియు । శుద్ధ
అచనముకు । సిద్ధంబుజేసితిని॥ భా॥ ఆవుపాలాపాంగలీ ।
అందమగు అతిరసాన్నముదోసెలు । పాయసాన్నమునే
తులు । భక్తింపుమిహిరణ్యగర్భ॥ భా॥ కనకపళ్ళెముల

తోడ । కర్పూరహారతులు మీాకిచ్చెదగ । తాంబూల మంత్రపుష్పం । అందులోఅర్కనీకుమొక్కెదగ॥ భా॥ ఆత్మభావముచేత । షోడశోపచారములు నేజేస్తినీ। పావనాతీతములను । కరుణతోపాలింపుమీా॥ భా॥ కాలత్రయముమీారు । లోకములు కరుణతోపాలింపుమా । పద్మబంధుడమిమ్ములా । పాృధిగంతుఘేల్లప్పుడూ॥ భా॥ త్రిగుణరూపముదాల్చి । మీాకీర్తిగదిక్కులను వెలయగాను । మూడుమూర్తులసారమై । ముదమొప్పవెలసితివి॥ భా॥ సహస్రకిరణకాంతి । లోకములు సరసముతోపాలింపుతూ । పన్నెండురూపులయ్యు । ప్రజలనుపాలించు॥ భా॥ సువర్ణబాణములను । నూటిగామెక్కుపెట్టినహాస్తము । అలవిగాదయ్యమీారు । మెవరికిని అర్కమిమ్ము వేడెదగ॥ భా॥ ప్రాతఃకాలమందునా । ప్రియత్నముతో బ్రహ్మరూపముదాల్చియు । ధవళవన్నెలఛాయలా॥ ధాతులివిదరిశేర్చు॥ భా॥ మధ్యాహ్నమందుమీారు। మార్తాండమధ్యమందు । రుద్రరూపముదాల్చియు । రూఢిగా వెలసితివి॥ భా॥ సాయంకాలములమీారు । దిశలన్ని రత్నదీప్తులుగమ్ముచు । విష్ణురూపముదాల్చియు । నెమ్మ

దితో వెలసితివి॥ భా॥ మేరుపర్వతమందునా । నిలచుండి
లోకములు గరుకుశాయా । లోకులుప్రార్థించగా । ర
క్షించియేలితివి॥ భా॥ ఇలమీదజన్మమెత్తి మీకథలు
యింపుతో వినవేర। నలినబాంధవుడమూపై నెనరుంచికరు
ణించు॥ భా॥ ఘోరపాపములలోను । వెతకితేనేను చే
యనిదిలేదు । నానేరములుయెంచకా । నలినాప్తనుగా
వు॥ భా॥ అకటపరిశుద్ధిలేక । నాజన్మనుకట వ్యర్థంబ
య్యెను । అకళంకమగుమార్గమూ । చూపుమీసర్వేశ॥
భా॥ అయిదుయింద్రియములగూడి । నామనసుఅంకెకే
రాకున్నది । మీపాదములచిత్తము । మళ్ళకనిల్పమీ॥
భా॥ రసేంద్రియములగుణము । బుద్ధినీప్రకటాహంకా
రము । యెంచలేనిప్రకృతీ । ప్రపంచకము నొప్పుచు
న్నది॥ భా॥ అరయకామక్రోధము । లోభమోహామద
మత్సరముల్ను । తరగవెన్నడుమనములో । దరిజేర్చు అ
ర్కుండమిము వేడెదర॥ భా॥ యెంచిచూచినఘటమున।
జన్మములుయెన్నలేనన్నిగలవు । చచ్చిపుట్టుచునుందు
దు। సత్యమిదిసర్వేశరక్షింపుమీ॥ భా॥ పదియేనుతత్వ
ములను । పాటిస్థైజీవుపైసంచరించు । గంధమిదిజీవాత్మ

డనుచునిన్ను। మెడ తెగక మెప్పుసు స్మరియించెద॥ భా॥
స్థూలసూక్ష్మము రెంటికి । పరీక్షి స్తైకారణలింగమింది ।
ఆ దేహమతలమయితె। అతులమగుపదవిన్నిఅందేరు। భా॥
గుణసహితమయినమాయా । మీఛాయప్రతిబింబమగు
చున్నది । అవిద్యఆవహించి । అవిర్భవించితివి॥ భా॥ బ
హుజన్మములకు నేడు । మీ కీర్తి పొగడంగ దొరకెమా
కు । ఆదిపరంజ్యోతిమమ్ము । పాలించుమర్కజా॥ భా॥
ఇట్టిదేహంబురోసి । గట్టిగా మీపాదములు నమ్మినా। ఘ
నమయినమాయగడచి । అంత్యమున మిమ్ములకలసేరు॥
భా॥ ఈ దేహమందుగాని। ముక్తిమరియేదేహమందు లేదు।
దేహమందుండిమీరు । తేటముగ తెల్పుకుంటిరి॥ భా॥
వేయుజిహ్వలుగల్గిన । ఆది శేషువలయినను । కీర్తిపొగ
డంగలేకఅలసి । ధరణిలో దాగుండె॥ భా॥ అజ్ఞానినతి
మూఢుడా । మీకీర్తిపొగడనెంతటివాడను । తప్పు
లెంచక నన్ను దరి జేర్చు॥ భా॥ ఆదిత్యభాస్కరుల నెవ్వరై
న । ఆచరించినపాపినా । పాపబంధములు బాయు । భా
స్కరా శ్రీసూర్యనారాయణా॥



## సూర్య వర్ణన.

తెలతెల్లవారగాను । స్వామితనరణభేరి మ్రోయ గాను । పక్షులుపలుకగాను । స్వామితనపక్షములుగదలగాను । గడియగడియకుజాముకు । కాంతలూకనున్నలూ పూడ్చేటివేళాయె । శ్రీసూర్యనారాయణా । (అని ప్రతిపదంఆఖరున పాడేది) కస్తూరికళ్ళాపు చిలకగాను । అతివెలలుకులు అలకగాను । ముగుదలుముగ్గులు పెట్టగాను । ముత్యాలతోరణంకట్టేటివేళాయె॥ శ్రీ॥ పొద్దుపొడుపుభానుడు పొన్నపువ్వులచాయ । పొన్నపూవులమీదపగడంపుచాయ । గడియెక్కిభానుడుగన్నేరుపువ్వుచాయ । గన్నేరుపువ్వుమీదకలగవువ్వుచాయ॥ శ్రీ॥ ఆరుఘడియలభానుడద్దంపుచాయ। అద్దంబుమీద నేలవవ్వుచాయ।జామెక్కిభానుడు జాజిపువ్వుచాయ । జాజిపువ్వుమీద సంపెంగచాయ॥ శ్రీ॥ మధ్యాహ్నభానుడు మల్లెపూవులచాయ । మల్లెపూవులమీద మంకెన్నచాయ॥ శ్రీ॥ మొండకొభానుడు । యిందనీలపుచాయ । ఇందనీలముమీద చంద్రినిచాయ॥ శ్రీ॥ మూడవఝాముున ములగపు

వులచాయ । ములగపూవులమీద ముత్యంపుచాయ॥ శ్రీ॥ నాలుగవఝామున నల్లకలువలచాయ । నల్లకలువలమీద నవరత్నచాయ॥ శ్రీ॥ వంగుతూభానుడూ। వంగపండూచాయ । వంగపండూమీద వజ్రంపుచాయ॥ శ్రీ॥ గుంకుతూభానుడు । కుసుమపువుచాయ । కుసుమపువుమీద కుంకుమపువుచాయ॥ శ్రీ॥ గుంకివచ్చినరథాలు సావిళ్ళదిగినాయి । మొక్కలాపీటపై ముదముతో గూర్చుండి । తడిపంచకట్టుకు బంగారుకలశముతో॥ శ్రీ॥ వెండికాగులతోను వేణ్ణీళ్ళుతోడిరి । భమిడికాగులతోను చన్నీళ్ళుతోడిరి । చన్నీళ్ళువేణ్ణీళ్ళు సమముగాతోడియు । ముత్యాలచెంబుతో ముగుదలందిచ్చిరి॥ శ్రీ॥ తడివస్త్రమువిడిచి పీతాంబరముకట్టి । తిలకంబుదిద్దుకో। నాస్వామిభాస్కరా॥ శ్రీ॥ జున్నిఆవులపాలు । ఆవునెయ్యి దెచ్చి । పాయసాన్నమువండి । పళ్ళెరమునుంచితీ । ఆరగించావయ్య॥ శ్రీ॥ బంగారుమేడలో । హంసతూలిక పైని । పట్టుపరుపులువేస్తి । పవళించునాస్వామి। నీళ్లు దాగపొద్దేది । నిలుచుండపొద్దేది । పాలుద్రాగపొద్దేది । పవళించపొద్దేది॥ శ్రీ॥ పాపాలుపుణ్యాలు సోధిం

చపాద్రేది । పాలించిగంగలోకలపనూపాద్రేది॥ శ్రీ॥
బాలభాస్కరునిపుట్టుక యెవ్వరైన । పాడినావిన్నట్టి పణ
తులకును । ఆయురారోగ్యంబు అయిశ్వర్యపదవిచ్చు॥
శ్రీ॥ దనరనయిదువతనము । తరుణులకుకల్గును । కుష్టు
వ్రులుమొదలగు కష్టములుతీరును । కమలాప్తుడుమెప్పు
డు కాచిరక్షించును॥ శ్రీ సూ॥



అనేకరకములు స్త్రీలపాటలు మాయొద్ద దొరకును.

మంగు వెంకటరంగనాధరావు,

బుక్కుసెల్లరు,

కాకినాడ.

1909.

